శ్రీ




# భగవద్భక్తి జ్ఞాన సారసంగ్రహము.

పరిటాల కొండలరాయ

ప్రణీతము.

1644



బెజవాడ

వాణీ ముద్రాక్షరశాల యందు

బి. కే. స్వామిచే

ముద్రించి

ప్రచురింపఁబడియె.



1913.



శ్రీరస్తు.

# శ్రీభగవద్భక్తి జ్ఞాన సారసంగ్రహము.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుంశశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే,

శ్రీరామచంద్రుడ శేవజేసెదనేను శర్వ్వాగోరెడి భవచ్చరణములను । శ్రీదేవివనమాల శ్రీవత్సములుగల వక్షస్థలంబును వైజయంతి । భువననిర్మాణ నిపుణుడగు బ్రహ్మకు జన్మకారణమైన జలజనాభి । ననుపమానంబును నఖిలశుభావహ మమృతాంశురేఖానిభాననమును । హారమణికుండలప్రభాపూరకలిత । కంబుసుందర గళమును గాత్రశుమర । శంఖచక్ర గదాపద్మ శార్ఙ్గములును । నళినదలనేత్ర జూపుము నాకునెపుడు॥ ౧

వాసుదేవాచ్యుత వనమాలిగోవింద పుండరీకాక్షయోభువనరక్ష । కేశవ పరమాత్మ కృష్ణత్రివిక్రమ పద్మనాభావ్యయ పరమపురుష । యఖిలలోకేశ్వర యభవదామోదర నారాయణానంతనారసింహ్వా । యాద్యంత రహితుడ యఖిలాంతరా

త్ముడ సచ్చిదానందుడ సర్వసాక్షి । వేద వేద్యుడ విశ్వాత్మ వి
శ్వపతివి । విశ్వరూపుడా విశ్వాత్మ విశ్వగర్భ । గరుణచే రక్షణము
జేయు గమలనాభ । విశ్వమయ విఘ్నవేజిష్ణ వేనమస్తే॥ ౨

పరమేష్ఠి లోకేశు పద్మసంభవు విధి బ్రహ్మదేవుని గొల్తు
భద్రముగను । పశుపతి భూతేశు భర్గు త్ర్యంబకు శంభుశంక
రునకు శరణు జేతు । బ్రాహ్మియు భారతీభాష గీర్వాణిని పూ
జింతు నెప్పుడు పుష్పములను । కాత్యాయనీదేవి కాళికా మొ
క్కెద సర్వమంగళ వమ్మ సత్యవతివి । దంతిముఖ యేకదంతుడ
దండ్నమయ్య । విఘ్నరాజ మీ రంత నిర్విఘ్నముగను । నేను
జెప్పెడి యీ కృతి నిత్యముగను । యుండునట్లుగ జేయుడీ యూ
ర్జితముగ॥ 3

శ్రీరామ శేవయు జేసెడి కొండలరాయాఖ్య దేహాంతరంగు
దేహి । భాగవతాదులు భక్తిచే పఠియించి యందలి యర్థంబు
నందుకొంత । దెలిసినదానిలో దేవదేవుని భక్తి ధీరత నెప్పుడు
దీనవృత్తి । మనసు నిల్పుటకునై మతియందు దలపోసి నాగా
యణాంహ్వాయానందపురుషు । చరణ యుగమును గొలచుచు
సాధువృత్తి । శ్రీనివాసుని కృపచేత క్షేమముగను । బుద్ధి
గోచరమైనంత పొందుపరచి । వ్రాయుచును జేసె బుధులకు
వందనములు॥ ౪

శ్రీరామహరివని స్థిరముగా పూజింతు వనరనామదినిపావ
హానంబు । జేసిపీఠంబిచ్చి నర్ఘ్యముస్న్నం ఘ్రములుగడిగి యుస్నా
చమనము । మధుపర్కములనిడి మంగళస్నానంబు గావించి

వస్త్రయుగ్మంబునిచ్చి। యజ్ఞోపవీతంబు యమరగంధంబిచ్చి య
క్షతల్తురసిదూర్వాంకురాది। పుష్పములూప్వజదూపమున్ భూ
రిదీప। మున్ చతుర్విధాన్నంబు తాంబూలమున్ స। మర్పణము
జేసి కర్పూరహారతియును। మంత్రపుష్పమున్నిచ్చితి మాధవు
నకు॥ ౫

సర్వంబు నీయందు సర్వమందున నీవు వసియించియుంటుట
వాసుడనియు। దివ్యప్రకాశంబు దేవనామంబగుట వాసుదేవా
ఖ్యంబు వనరగలిగె। పరవాసుదప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధ
వ్యూహమై చతుర్విధములు సహస్రనామములునుగలిగిననిన్ను
నేదలచెద నెపుడుమదిని। నిర్వికారనిరంజననిష్కళంక। నిత్య
పరిపూర్ణ నిర్గుణనిర్మలుండ। వాదిమధ్యాంతరహితుడవైనవిష్ణు।
హరి నమస్కారములేయు నమరుజేతు॥ ౬

ఎవ్వనిబలమున నింద్రుండు నుదయించె దేజంబువలననుద్దేవ
తలును। కుక్షినిసర్వంబు కోపంబునను రుద్రుడర్షమున విరించి
యక్షులందు। యినచంద్రులును వక్షమున లక్ష్మీదేవియు యిం
ద్రియంబుల మునువేదములువి। హారములందున యప్సరోగ
ణములు ముఖమగ్ని బ్రాహ్మణుల్ముఖ్యులైరి। బాహువు రా
జతోడవై శ్య పాదములను। శూద్రులున్ గంగ కేశముల్ద్రు
మములు। గలిగినట్టి విశ్వాత్మజగన్మయునకు। నధికముగ న
మస్కారము లమరజేతు॥ ౭

పంకజనాభుడ పరమేశ్వరుండవు పరమహంసలకును బ్రాప్త
కుడవు। పూర్ణుడ పుణ్యుడ పురుషోత్తముడవునుపుండరీకాక్షుడ

భువనసాక్షి । సూక్ష్మేంద్రియాత్ముఁడ సోమరూపుఁడవును స్వర్గా
పవర్గుఁడ స్వప్రకాశ । బ్రహ్మాదులకు నెల్ల బరమైన దైవంబ ప్రణ
వస్వరూపుఁడ ప్రాణనాథ । క్షరమున క్షరములకును పరుఁడ
నంత । విశ్వసంవేద్య విశ్వేశ విశ్వరూప । భక్తజన పాపహర
ణుఁడ పరమపురుష । నాశ్రయింతును నఖిలాత్మ వైన నిన్ను ॥ ౮

అద్వితీయుండవు యఖిలాంతరాత్మవు నన వద్యమూర్తివి
నజుఁడవీవు । చిద్రూపకుండవు చిచ్ఛక్తియుతుఁడవు నిర్గుణుండవు
నిత్యనిర్మలుఁడవు । మాయకతీతుఁడౌ మాయాశ్రయుండవు హరి
హరబ్రహ్మయున్న ధిపుఁడవును । యాత్మీయశక్తిచే యఖిలంబు
గల్పించి యందుబ్రవేశించి యుందువీవు । దారువులనగ్ని యుండు
చందమున దేవ । నీప్రకాశంబు నెన్న నేనెంతవాఁడ । భూరిసంసార
తాపనివారకంబు । యీశ నీపదాంబుజ భక్తినిమ్ము మాకు ॥ ౯

శ్రీలక్ష్మికౌస్తుభ శ్రీవత్సములుగల్గి వక్షస్థలంబును వైభ
వింప । వలనొప్పుచుండెడి వనమాలయునుగల్గి వైజయంతీ ప్ర
భల్వన్నెఁజూప । మహనీయనవరత్న మయకిరీట ప్రభానిచయం
బు దిక్కులనిండిబర్వ । గాంచనమేఖలా కాంతులతోఁడగా శే
యచేలద్యుతుల్చెలిమి శేయ । కనకమణిమయ కంకణ కరము
లొప్ప । లలితనీలాభ్ర రుచిరగుంతలములుదనర । హారకేయూర
వలయ మంజీరధరుని । నమ్మిగొల్చెద శ్రీవిష్ణునాదు మదిని ॥ ౧౦

సలిలతేందీవరశ్యామల గాత్రంబు భానుకోటిప్రభా భాసి
తంబు । భక్తజనసుసేవ్య పాదపద్మంబులు నార్తజనావళి కభ
యహస్తు । దరహాసామృతపూర దంతపంక్తియుగల యమ్మ

తాంశు రేఖానిభాననమును । పద్మమిత్రామిత్ర భాసుర నేత్రముల్ సుందర భ్రూనాససురుచిరంబు । చారుమృగరాజసన్నిభ స్కంధ యుతము । నహి హితాహితశయన వాహనముగలిగి । దివ్య మంగళ విగ్రహుఁ దేవదేవు । డైనహరికి నేమ్రొక్కెద నవ రతము॥ ౧౧

## భూతేంద్రియాది సృష్టివివరము.

యీసృష్టి పూర్వమందేమియు లేకను యేకమై యెవరికి నెరు గరాక । నుండునదేదియో దంశిఫరబ్రహ్మమదిగోర దనశక్తి నమరెసృష్టి । యాశక్తె ప్రకృతియు యవ్యక్తమందురుయం దు మహత్తత్వమమరగలిగి । నాతత్వమునను యహంకారము నుదాన పంచతన్మాత్రలు బరగబుట్టె । నవియుగగనము వాయు వు నగ్ని జలము । ధరణియు ననంగ పంచభూతంబులయ్యె । నుర్వి యందున నోషధులుద్భవించి । యన్నమాయె నందు పురుషు లైరి మరియు॥ ౧౨

పంచభూతంబులు పంచీకృతంబులై పంచవింశతియుగాబర గెనవియు । నాకాశమర్ధాంశ మంతఃకరణమయ్యె యర్ధంబు శక లంబులయ్యెనాల్గు । వాయువర్ధాంశంబు వ్యాసవాయువునయ్యె యర్ధంబు శకలంబులయ్యెనాల్గు । జాతవేదార్ధంబు చక్షురింద్రి యమయ్యె యర్ధంబుశకలంబులయ్యెనాల్గు।జీవనంబునందర్ధాంశ జిహ్వాయయ్యె । కడమయర్ధంబు నాల్గుశకలములయ్యె । పృథ్వి యర్ధాంశమదియును పానమయ్యె । యర్ధమున్నాల్గు శకము లయ్యెమరియు॥ ౧౩

ఆకాశశకలమందని లాదిశకలము ల్వరుసగాఁబొందునవసర
గలుగ। మనసుబుద్ధియు చిత్తమాయహంకారమై యనిలంబు
నందున యభ్రమాదు। లొఱుసగాఁగలియంగ నొనరె సమాన
ము దానముప్రాణమపానములును। యగ్ని శకలమందు నాకా
శమాదిగాఁ జేరి శ్రోత్రత్వక్కు జిహ్వాఘ్రాణ। మైసలిలమందు యం
బరమాదిగలిసి। శబ్దముఁ స్పర్శరూపమున్ గంధమయ్యె। పుడ
మి గగనాదిశకలముల్పొందు గలిగి। వాక్కుపాణి పాదోపస్థ
వరుస గలిగె॥ ౧౪

మాతృభుక్తాన్నంబు పితృభుక్తాన్నంబు శుక్లశోణితములై
సుస్థిరముగ। నవిరెండు గలియుటన్నపుడు దేహంబాయె నది
యన్న మయకోశమనగనెప్పు। ప్రాణకోశంబన ప్రాణముల్
కర్మేంద్రియములైను జ్ఞానేంద్రియములు మనసు। నారుమనో
కోశమ్మాబుద్ధివిషయము ల్విజ్ఞానకోశమై వెలయుచుండు। మో
హాజనకంబు మోదప్రమోదవృత్తి। సకలదృశ్య ప్రపంచాది
సంయుతంబ। నాద్యవిద్యాంధకార మనంగబరగు। నదియు నా
నందమయకోశమనగనెప్పె॥ ౧౫

స్థూలదేహంబును సూక్ష్మదేహంబును కారణదేహమున్
గలవుమూడు। ఘనయవిద్యయు ముఖ్యకారణంబగుదాన ఘన
సూక్ష్మమున్ స్థూలఘటము లమరె। దానియందభిమాని దా
జీవుడగుటను ప్రాజ్ఞడన్నామంబు బరగెనతడు। సూక్ష్మదేహం
బున సొంపుగాఁబదునేడు తత్వముల్యభిమాని తైజసుండు। స్థూల
ఘటమున యిరువదినాలుగింద్రి। యంబులభిమాని విశ్వుండు

ఝువగనొప్పె। పంచకోశంబు లాజీవు బరిణమింప। తనను దా
దెల్యకుండును తత్వముగను॥ ౧౬

త్రిగుణమగు ప్రకృతి ద్వివిధంబునై యొప్పె మాయయ
విద్యయై మహిమనందు। సచ్చిదానందుడు స్వయముప్రకాశుం
డు నద్వితీయుండఖిలాత్ముడయ్యె। నామాయప్రతిబింబ మది
యీశ్వరుండై వశీకృతమాయుడున్ స్వేచ్ఛుడయ్యె। జీవుడనయ
విద్యచే ప్రతిబింబుడై నాయవిద్యకువశుడగుటదేహ। మందునే
నని యభిమానమొందిభవము। నొందుచుండును యీశ్వరు
డెందును యభి। మానశూన్యుండు భజనీయు మహిముడతడు।
సకలజీవులకును ము క్తిసాధకుండు॥ ౧౭

సత్వమున్మరి రజ_స్తమములు మూడును ప్రకృతి గుణంబు
లై బరగుచుండు। మరిమూలప్రకృతియు మహద హంకారంబు
నై దుతన్మాత్రలున్నష్టవిధము। దశ యింద్రియంబులు దగిలెడి
మనసును పంచభూతంబులు పదియునారు। నవియు వికారంబు
లననొప్పునని జెప్పి రాచార్యులాకపిలాదిమునులు। జీవుడాయిర్వ
దేడింటిజెంది సాక్షి। యామణగణంబులనుసూత్రమమరియుండి।
నదియు వేరై నవిధము నన్నాత్మయుండు। వెదుకవలయు దేహ
మున వివేకఘనుడు॥ ౧౮

పునర్జన్మాది దుఃఖంబులు గలుగుట.

విరివిగా దేహితా వేరాట నెరుగక దేహంబుతానని దెలిసి
కొనుచు। నతడవిద్యగుణాదులందు దగిలి యహంకారమూఢత
ముడై గడగ్గియపుడు। గృహమందు పుత్రుఃన్ గృహిణిమిత్ర

క్షేత్ర ధనబంధువులయందు ధాన్యమందు । మోహితుండయ్యు
ను ముదమున కర్తను నేను నేనను బుద్ధినెగడుచుండు । పాప
కర్మములందు పామరుండు । నింద్రియవిషయ చింతననెపుడు
మరిగి । స్వాప్ని కార్థాగమంబున తత్పథంబు । లునగు కామాద్యు
లన్మనోలోలుడగుచు॥ ౧౯

కాలంబు గడుపంగ కాలమృత్యువువొచ్చి నావహించున
పుడు నాళములను । గంఠనాళంబున కఫముకుత్తుకనిండి ఘుర
ఘుర శబ్దంబు ఘోషబెట్ట । మరణయవస్తను మనములో
దుఃఖింప యమభటులిద్దరు యపుడువచ్చి । కాలపాశంబునగట్టి
యుప్రాణముల్పెకలించి దీసియుబిగియబట్టి । యాతనశరీరమందు
నియామకంబు । జేయబలవంతమునను నాజీవుడపుడు । దండన
మున కభిముఖుడై దండధరుని । భటులుజేయు తర్జనలచే బాధ
నొందు॥ ౨౦

అనుపమక్షుత్తృష్ణలంతర్వ్యథలుజేయ ఝంఝానిలజ్వాలజ్వా
లనచండ। భానుప్రదీప్తితప్తంబైనవాలుకామార్గానుగతతప్య
మానగాత్రు । డై వీపుగశలచే నడువంగ వికలాంగుడగుచు
మార్గమునందు నచటనచట । జాలమూర్ఛిల్లి యాశ్రమశూన్య
మగు నీళ్ళమునుగుచు లేచుచు మొనసిపాప । రూపమైనతమ
ముచే నిరూఢుడగుచు । వెలయదొంబది తొమ్మిదివేలయోజ ।
నములదూరంబుగలయమనగరమునకు । బూనియమభటుల్గొని
పోవబోయి నచట॥ ౨౧

కర్మంబులకు దగుకష్టముల్పొందను శమనుండుశాసించు
శాల్మలియును । మిశ్రంబుననియు దామిశ్రంబుదప్తోర్మి కార

వంబును మహారౌరవంబు । గుంభిపాకమునంధకూపంబు నాది
గా నేకవింశతియు నరకములుగల । వందులోబడ వేసి యసిపత్ర
ములగోసి శూలయలందు నిమియుశూలములను । బాడచియగ్ని
త ప్తతగిలములను ముంచి । సిక్షలెన్ని విధముల జేసిననుయ చట।
యాతనశరీరము చడదుయందునున్న । జీవుడధికముగను బాధ
జెందుచుండు॥ ౨౨

తల్లిదండ్రులకును ధరణీసురలకును నహితంబు జేసిన యట్టి
వాడు । కాలసూత్రంబనుకడు దీవ్రనరకంబునందును నందంద
యయుతయోజ । నాయతపాత్రాదులందుల సూర్యుండుమీద
గ్రిందను వహ్నిమిగులమండ । నత్యంత క్షుత్పిపాసాదుల చేతను
బాధితుండగుచుండు బాయకెపుడు । బరువువెట్టుచున్న బడియు
న్న నిలచిన । గదలకున్న జాలనొదిగియున్న । బాధబొందుచుండు
పశురోమముల లెక్క । వగుసనపరిమేయవత్సరములు॥ ౨౩

వ॥ యిట్లు భాగవతపంచమస్కంధాంతమందు శుకమహా
ఋషి పరీక్షిన్మహారాజునకు నుపదేశరూపమువ దెలిపినది సం
క్షేపరూపకముగా నిందువ్రాయబడియె.

గీ॥ కర్మశేషమనుభవింపక ర్తజేసి । మరలజన్మమునొందనా
మందభాగ్య । నచలయందున బడవై వనట్టిజీవు । డపుడు తృణ
లతలోషధులందుబడియు॥

పుడమినోషధులను బురుషుండు బక్షింప నప్పుడాజీవుడునతి
నిగర్భ । మందునజొచ్చియు బిందురూపమునొందు నదివధూ

గర్భంబునందుబడియు । ఘనబిందువొకరాత్రి గలలమై బంచ
రాత్రముల బుద్బుదమునౌ దశమదివస । మందునకర్కంధువై
యుండినంతటచేసి యైకడపట బెరుగుచుండు । కల్పమగునొక్క
నెల మస్తకంబుమాస । యుగళమునగరచరణములు యుదయ
మగును । చలగిమూడవమాసమ్మున్ చర్మలింగ । గంధ్రముల్
గల్గు చుండునురయముగాను॥ ౨౪

నాలవమాసాన నయముగా ధాతువుల్పంచమనెలను పిపా
సమరియు । నాకలిగలుగును నారవనెలయందు మావిచేజుట్టు
కమాతృకుక్షి । దక్షిణదిశ గ్రిమిబక్షితదేహుడై మూర్ఛల
నొందును ముదములేక । యాతల్లిభుజియించు యన్నపానంబుల
వలనుదృప్తినిజెంది వదిగియుండి । జంతుసంకీర్ణవిణ్మూత్రజలము
లందు । బడియు దిరుగుచు గ్రిములచేభక్షితుండు । మాతృభ
క్షణకటుతిక్తమధురలవణ । మాదిరసముల తప్తాంగు డగుచు
నుండి॥ ౨౫

కుక్షియందు శిరముగూర్పు కనుండును పృష్ఠగ్రీవోదరం
ష్టముగను । బంజరంబందునబడినశకుంతల చందంబునౌస్వాం
గచలనలేక । దైవకృతంబుచే దాజ్ఞానవంతుడై బూర్వకృతం
బైన బుణ్యపాప । చయమున నూర్ధ్వముచ్ఛ్వాసంబుజేయుచు
సుఖలేశమునులేక సుడినిబడుచు । విట్క్రిముల సోదరుండునై
విమలమతిని । నేడవనెలను విజ్ఞానమేర్పడంగ । గర్భవాసము
నొందుట దుర్భరమని । చింతనొందుచు భీతుడై జీవుడపుడు॥ ౨౬

సప్తధాతువులచే గుప్తదేహుడును కృతాంజలిపుటుడయ్యు
ఖానునెవని । చేనుదరమున వసించుటకు నియమింప బడెనా

సర్వాత్ముబరమపురుషు । నిట్లని స్తుతియించు నేర్పు చేననయంబు భువనరక్షణముకై బుట్టువాడు । స్వేచ్ఛానురూపుడై నిచ్చ లేక్షన్ను విష్ణుడవ్యయు బరమాత్ము డచ్యుతుపద । వనజయుగ్మంబు వారనిభక్తిగొలుతు । పంచభూతవిరహితుండ పంచభూత । విరచితంబైన దేహమున్బరగినింద్రి । యాదుల చెడిదాభాసుడన్నధికగుణుడ॥ ౨౭

యెవ్వడు నిఖిలభూతేంద్రియమయమగు మాయావలంబన మహితకర్మ । బద్ధుడై వర్తించు పగిదిని దందహ్యమానమహా జీవచింతనమునందు । నవికారమై శుద్ధమై యఖండజ్ఞానమున నుండువానికి ముఖ్యచరితు । నకుంఠిత శౌర్యునకు బరంజ్యోతికి సర్వజ్ఞునకు గృపాశాంతమతికి । గడగి ప్రాకృత పురుషుల కంటెబరము । డయినవానికి మ్రొక్కెదనస్మదీయ । దుర్భరోదగ్రభీకరగర్భనరక । వేదనలజూచి శాంతిగావించుకొరకు॥ ౨౮

అ[illegible]చే నవమాసమాంతము మ్రొక్కుచు దేహంబువలనను దేహివెడల । గోరుచు నెలలెన్ని గొనుచునునుండునుగర్భంబువలనను గడకుద్రోయు । వారెవ్వరింకను వనజనాభుడు దప్ప బుండరీకాక్షుడు భువనరక్ష । కుండు నన్నిప్పుడు నీకుక్షినరకము లోనుంచి వెడలజేయనోపునంచు । నమ్మహాత్ముని చరణముల నవరతము । దలచి మ్రొక్కుచునుండును తనను నెపుడు । జన్మదుఃఖ జరాదుఃఖ జాయదుఃఖ । ములనువిడిపించు హరియని మొరలుబెట్టు॥ ౨౯

గలిగెడి బహుదుఃఖములకు నాలయమైన యీ గర్భనరకమున్నిట్లు నేను । గడువనోపుదునంచు ఘనచింతనము జేయు దశ

మమాసంబును దగులునపుడ । ధోముఖు జేసిన దుఃఖాలయం
బున నుచ్ఛ్వాసనిచ్ఛ్వాసయూపిరెడక । రక్తదిగ్ధాంగుడై భక్తి
భావన చెడి క్రిమిబోలె జడుడునై క్రిందబడియు । నేడ్చుచుమల
మూత్రములను విడ్చుచుండి । నందులోపల బొరలుచు నంత
మీద । బాల్యమున మాతృపితృలను బాధబెట్టు । సుఖము కష్ట
ము లెరుగక సుస్థిరముగ॥ ౩౦

పౌగండమునవిద్య ఫలమపేక్షింపక యప్పుడుయాటలయం
దుదగులు । యవ్వనమందనయంబు శిశ్నోదరాదులకు దుస్స
హావాసదుష్ప్రవృత్తిగ । హంబుమరగియు సాహసము వృథాయ
హంకారమూఢత మమకారములను । జేయుకర్మఫలంబు జెంది
యుదుఃఖించు నంతమీద జరయునధికమైన । బడుగుముసలెద్దు
రోసినపగిదితనను । పరులుబోషింప బహుదుఃఖ బాధలొంది ।
మరణమునుబొంద నరకమున్మరలజన్మ । మున్గల్గుచుండు[illegible]ప్పుడు
మూఢునకును॥ ౩౧

దిన దినంబునకును దెగిపోవునాయువు నేమరపాటునన్నెరు
గలేక । దేహపుత్రాదుల దిరముగానమ్మియు నెపుడుమోహము
నొందు నిష్టముగను । సంసారమగ్నుడై సాధు సంగంబును
సజ్జనమైత్రియు శమదమంబు । వినయసంపత్తి వివేకంబులును
లేక విష్ణుభక్తి విడచివిషయచింత । దగిలి కాలము గడుపుచు
తనకుజీవి । తంబునిజమని దృఢముగాదలచుచుండు । జరయుమ
రణాదులను తానిజము నెరుగక । పుణ్యకర్మముజ్జేయడా పురు
షుడధము॥ ౩౨

## ఉత్తమ జన్మలు.

జన్మంబునొందెడి జంతువులందున మనుజులు నుత్తముల్మో హినియంద్రు। వారలయందును వర్ణముల్నాలుగు తలపబ్రా హ్మణులు నుత్తములునందు। వేదవేత్తలునందు విలసితవేదా ర్థవిదులును విజ్ఞానవేదులరయ। వారికంటెను సంగవర్జితులుత్త ము ల్వారిలోపలమునివర్తనులును। సకలధర్మ పరిత్యాగసరణి నొప్పి। భగవదర్పితసర్వస్వభావయుతులు। సర్వభూతదయాళులు స్తర్వసములు। యధికులనిజెప్పిరా కపిలాదిమునులు॥ 33

## ఉత్తమపురుషవర్ణాశ్రమధర్మలు.

సకలజాతులకును సమమైనధర్మము ల్బదరికాశ్రమమునభగ వదంశ। నారాయణఋషియు నారదునకుజెప్పె నవియుధర్మ జునకు నతడుజెప్పె। నారాయణస్మరణ యథోచితజపము శౌ చమ్ముణ దానంబుస్సైరణయును। సదసద్వివేకంబు సత్యంబు బ్రహ్మచర్యంబు నింద్రియనిగ్రహామునహింస। సకలభూతదయ సమదర్శనమునసాధు। సఖ్యమునుగల్గి శ్రీహరిచరణకమల। శేవ వందనకీర్తన శృతమునాది। జెప్పి జాతిధర్మము వేరు జెప్పె మరియు॥ 3౪

దమమును శౌచము స్తపము శమంబును స్మార్తకర్మాది సంస్కారములును। క్షమయునహింసయు సత్యంబుహరిభక్తి వేదాది షట్కర్మవిప్రుధర్మ। దానశీలము శౌర్యధైర్యప్రసా దము నాత్మజయంబును నర్థకామ। ముస్బుధాచార్యుల మురహరి శేవయు బరితోషణంబును బరమభక్తి। దండనీతియువిప్రు

లన్ దగిన రక్ష । సత్కృతులనుపొందుటయును సత్యవాక్య । మధ్యయనమాదిగా కర్మలైదు జేసి । ధార్మికుడునౌట రాజుకు ధర్మలనియు॥ 37

ధర్మార్థకామము ల్దావాంఛ జేయుట నిర్మలగురుశేవ నిత్య శుచియు । దేవబ్రాహ్మణులొద్ద దీనుడై భక్తిచే గోరక్షణము నందు గోర్కెగలిగి । బ్రమదమునిర్మదభావత్రివిధకర్మ జరుపుట నివి వైశ్యజాతిధర్మ । చోరత్వమును లేక శుచియుగా నుండుట తననునేలినవాని ఘనముగాను । శేవ జేయుచు బ్రాహ్మణశేవ జేసి । మంత్రమును లేక పితృకర్మతంత్రముగను । జేసివిప్రసంతుష్టియు జేయుటివియు । శూద్రజాతికిధర్మముల్ భద్రముగను॥

సంకరజాతికి సముచితవృత్తియు కైరవకురు చర్మకారకులును । ఖగమృగాదులజంపు కటికియావ్యాధుడు నటబురుడకభిల్లులటులమరియు । హీనులునిందితుల్ యింక చండాలుపుల్కసుడును మాతంగుకతిసకులజు । లైన నాయాజాతులందుచోరత్వమున్ జీవహింసపగుల చెరుపులేమి । జేయకనుమాతృపితృ పూజ జేయువాడు । భయవిరహితుడుత్తముడౌను వానినెపుడు । జాతిమాత్రహీనుడనుటజనదుసుగుణ । మధికజాతిని లేకున్న యధముడండ్రు॥ 38

## ఆశ్రమధర్మలు.

మౌంజికౌపీనకమండలుపాలాశదండకృష్ణాజినధరుడునగుచు । యజ్ఞోపవీతంబు యక్షమాలికగల్గి బ్రహ్మగాయత్రియు బఠన జపము । గురుమందిరము జేగి గురుచరణములకు । [illegible]

సుని చందముగనుభక్తి । వినయవిధేయుడై వేదంబు చదువుచు
విహితగృహంబుల భిక్షమడిగి । మితముగాభుజియించి యమిత
పలుకులు।బలుకకనుమౌనశీలముసలుపుచుండి । యంగనామణు
లున్న చో సంగముడిగి।బ్రహ్మచర్యవ్రతస్థుడౌ బ్రహ్మచారి॥ ౩౮

నిత్యకర్మలు జేసి నిజపత్నితృప్తుడై మాతృపితృల గురువు
మనసునొవ్వ । నివ్వకపూజించి నిత్యమున్ వేదాంతయుపనిష
దార్థంబు యుక్తముగను । గురువులచేతను గుఱుతుగా దెలిసి
యు గృహధర్మములనుండి గృహమునందు । బ్రహ్మవిచారము
స్ఫురగంగ జేయుచు గురుమంత్రమందును గురువునందు । బ్రహ్మ
భావంబునుంచియు భద్రముగను । సర్వభూతంబులందును సర్వ
మయుడు । నంతరాత్మయొకడె యుండునని గృహస్థు । మదిని
నిశ్చయంబైన బ్రహ్మంబుబొందు॥ ౩౯

గీ॥ వనముకేగి వనప్రస్థవహ్నియర్క । పక్వమూలఫలా
హారుపరమయోగి । యైయమనియమమాది యష్టాంగనియతి।
యుక్తమవ్రత తపసియై యుండవలయు॥

భిక్షుడెప్పుడు నిరపేక్షు నిరాశ్రయు దండమున్కౌపీనధరు
కమండ । లంబు కాషాయవస్త్రంబుగలిగి సర్వసంగ పరిత్యాగ
సరణినుప్పి । సమచిత్తవృత్తియు సదసన్మయంబైన విశ్వంబు
నందును నీశ్వరేశు । నాత్మానుసంధాన మమరంగ జేయుచు
నేకాంగియునెపుడునేకభుక్త । భిక్షగొనుచు రసములందపేక్ష
లేక । భూతసంభవ నాశనమూలమైన । కాలమున్నప్రతీక్షించుచు
భువనయవిద్య । మూలమణచిన విజ్ఞానిముక్తినొందు॥ ౪౦

## కర్మవిషయము.

ఉపనైనకర్మచే నొప్పిరిద్విజులన వేదాదిషట్కర్మ విప్రధర్మ। బ్రహ్మవిచారులు బ్రాహ్మణులననొప్పి రింక జెప్పిరికర్మ సంకటముగ। స్నానమ్ము జపహోమసంధ్య దేవాతిథిమాతృ పితృలపూజ బ్రహ్మయజ్ఞ।వైశ్వదేవంబివివదలని నిత్యముల్మెలు యజ్ఞాదినైమిత్తికములు। జేసిరేనియు స్వర్గంబుజెందుకొరకు। పుణ్యమ్ము క్షీణమైనను బుట్టవలయు। నరయగా దేహిగుణ సంగియైనయపుడె। పూనికర్మంబు జేయకమానరాదు॥ ౭౧

గంగ గోదావరి కావేరి నర్మద యమున సరస్వతి యాద వతియు। భీమకృష్ణయు సింధుబేరైనసాగరంఫాల్గునంబును సేతు ఫల్గునియును। కంపననందయుఖచరనందాల కహంసవైతరణి యు నాదినదుల। స్నానాదికము జేయ సమయుపాపంబులునశ్వ మేదాదులనైనఫలము। నొందుదురనియు నయోధ్య మధుర మాయి। కాశియు నవంతికా ద్వారకాపురంబు।కంచికేగి పూ జింప మోక్షకరమనుచు। ఘనముగాజెప్పి రార్యులు గ్రంథ ములను॥ ౭౨

## భక్తి విషయము.

పురుషదేహంబుకై భోగమపేక్షించు దేహంబునెప్పుడు స్థిర ముగాదు। దేహితోడనురాదు దేహము మృతియైను శునక ము లృతిక్షించు శుభములేదు। ధర్మార్థకామము లరిజేర్పజాలవు కర్మబంధములను గలుగజేయు। మోక్షమపేక్షయు రక్షించ గలదది జ్ఞానభక్తులగల్గుననిరి బుధులు। మోక్షదాతయు విష్ణు

డామూర్తిపరమ। పురుషుడుంచభూతాత్ముడు భువనకర్త। సకల భూతంబులకు నాత్మసర్వమునకు। నీశ్వరుండాహరిని భజియింప ముక్తి॥ ४३

మోక్షమపేక్షించు ముక్తుడువిధిచోదితముగాను నెపుడు హృత్కమలమందు। నున్నవిశ్వాత్మను సన్నుతిజేయుచు మీరి నభక్తిచేమిగులసంస్మ। రణజేయుచు బగలురాత్రులు సంధ్యల దగిలిజితేంద్రియుల్ధర్మయుతులు। యావాహనంబును యర్ఘ్యపాద్యాదిగా పుష్పాక్షతాదులు పూజజేసి। భక్ష్యభోజ్యపాయసమాదిబహువిధాన్న। ములను నైవేద్యమిచ్చి తాంబూల మొసగి। మంత్రపుష్పార్ఘమెరిగియు మానసమున। పూజజేసిన పురుషుడు ముక్తినొందు॥ ४४

అనుపమభవపరిహారంబుకై భజనీయుడా పరమాత్మ నిర్మలుండు। శుభకరమూర్తియు శోభనతరితుండు ననఘుగుణాశ్రయుండైనవిష్ణు। గుణరహితుండును గొప్పదేవుండని వేయునామంబులు వేడ్కతోడ। భక్తిచేనెప్పుడు భావమందున నిల్పి ముదముతోనుడువుచుముక్తిగోరు। నమ్మహాత్ములు సామాన్యమధికద్రవ్య। సమితిచే తత్పదార్చన సద్గుణాశ్ర। వణమనన జేయుచుండుటభక్తియాను। బరగ పూజించువారలు భక్తులగును॥

హరిమయమంతయు హరివిశ్వమయుడన్న భక్తుడాప్రహ్లాదు బాధలుడిపె। యార్తిచే ద్రౌపది హరిరక్ష రక్షన్న యవుడిచ్చెవలువలు యక్షయముగ। గజరాజుమూర్ఛిలి గమలాక్ష రక్షన యాక్షణంబాతనిరక్షజేసె। యంత్యకాలంబున హరిపేర జామిళుడన్నమాత్రముచేతనమరెముక్తి।యార్తజన రక్షకుండు

శ్రీహరియునగుట। విష్ణునామము ల్వేమారువిమలమతిని। నోట నుడువుచు భ క్తిచేపాటలందు। పాడుచుండెడివారికి పరమసుఖము॥ ౨౬

సకలరోగంబులుసమయింపజేయునుహరినామచింతనయనవరతము। బ్రహ్మహత్యానేకపాపంబులణగించు హరినామచింతనయనవరతము। సకలసంపదలను సమకూర్చుచుండును హరినామ చింతన యనవరతము। సర్వలోకానంద సౌభాగ్య యుక్తమౌహరినామచింతనయనవరతము। పుణ్యమూలంబులనపాయపోషకంబు। లభిమతార్థంబు లజ్ఞాన హరణమగుట। భ క్తిచే సంస్మరణజేయు భాగవతుడు। విష్ణుచింతన నెప్పుడు విడువడతడు॥ ౨౭

సద్గురుశేవయు సాత్వికంబు హరికథామృతపానంబుదపము సత్య। వ్రతమును దుర్జనవర్జనంబును యదృచ్ఛాలాభ సంతుష్టి శాస్త్రవేద। యర్థజిజ్ఞాసయు నపరిగ్రహంబును దేవతాంతరము నిందింపకునికి। గరణత్రయంబుల గలిగెడుద్రవ్యంబు హరికర్పణముజేసి నారగించి। సర్వభూతమయుండైన సరసిజాక్షుడతడె తనయందునుండాత్మయనియు నిఖిలజగముసర్గస్థితిలయముజరుపునంచు। భ క్తిసలిపెడువాడు సౌభాగవతుడు॥ ౨౮

ఆదినారాయణుం డఖిలాత్ముడాహరి కర్మయోగంబులగానబడడు। జ్ఞానయోగంబును ఘనభ క్తి యోగంబు నీరెంటిచేతను నెరుగనౌను। దపజపయాగాది ధర్మములవి పుణ్యకర్మము ల్దేవలోకంబునొసగు। నాత్మతత్వ జ్ఞాన మది నిశ్చయంబైన ముక్తిజానాతడు పుట్టడింక। సర్వధర్మపరిత్యాగ సరణినొప్పి।

నన్ను నొక్కని శరణన్న నిన్ను భవవి । ముక్తుజేతు జదువకంచు
ముదముగాను । కేశవుడు పార్థునకుజెప్పె గీతలందు॥ ౮౯

దేహమందుండెడి దేహియా నాయాత్మ సాక్షిభూతంబున
సంవృతంబు । నిత్యంబు శుద్ధంబు నిర్గుణంబు గుణాశ్రయము
నేకమున్న వ్యయంబునౌను । దీనినెవ్వండైన దేహంబుకంటెను
వేరుగాజూచునో విబుధుడతడు। దేహధారియునయ్యును గృహ
ధర్మములనుండి భగవదర్పితకర్మభక్తిసలిపి । శ్రద్ధచేశ్రవణమన
నశాంతియుక్తు । డై గృహముననున్న యతనికదియు బంధకర
ముగాదు ముక్తుడనుచుఘనముగా ప్ర। చేతసులకు వైకుంఠుం
డుజెప్పెమున్ను॥ ౯౦

క్షీరసాగరమందు శేషశాయియునైన యాదినారాయణుం
డష్టభుజుడు । వక్షస్థలంబున వసియించులక్ష్మియు శ్రీవత్సకౌస్తు
భచిహ్నయుతుడు । బాలసూర్యప్రభా భాసమానంబగు కోటీ
రధరుడునుకోమలాంగు।యిందిరాహృదయారవిందారుణోల్లాసు
శ్రీకరపీతకౌసేయవాసు । శంఖ చక్ర గదాయుధసాధనుండు ।
దివ్యమంగళవిగ్రహుడుదేవదేవు । డైనహరిని తనహృదయమందు
నిల్పి । భక్తిచే ధ్యానమొనరింప ముక్తుడగును॥ ౯౧

కమలాక్షుసేవయు గరమనురక్తిచే జేసినగల్గును చిత్త
శుద్ధి । యీశ్వరనామము ల్యిష్టముగదలచి హరితత్వపఠన మ
హర్నిశాదు । లందున జేయుచు నధికంబుగావాసు దేవాచ్యుతు
వరదుదేవదేవు । భజనంబువైకుంఠునిజచరణకమల ధ్యానంబు
జేయుచు తత్వవిదుడు । గామలోభాదుల గెల్పిఘనముగాను।
యింద్రియంబుల బంధించి యీశ్వరుండు । నైనసర్వమయుని

విష్ణునాత్మ నెరిగి । భక్తిసలిపిన వారికి ముక్తిగల్గు॥ గీ౧

భవభయంబుల బాపు బరమాత్ముడా హరి భజనీయుడనియు శోభనచరిత్రు । భగవంతుడనియును భావంబులో పల భక్తిచే కర్మలు భగవదర్పి । తంబుగ సుజనహితంబుగా పూజలు సలుపుచుండెడి బుద్ధిసాత్వికంబు । విష్ణుచింతన లేక విషయచింతన చేత రాగంబుగల పూజ రాజసంబు । సతతహింసాది దంభమాత్సర్యరోష । తమములను జేయుచును భేదదర్శియగుచు । బరులుజూడనుగావించు భక్తిదలప । తామసంబన దగువాడు తామసుండు॥ గీ౩

యేమహాత్ములెపుడు యిందిరాధీశుడౌ పరమేశ్వరుని యందు భావముంచి । నిష్కాములయ్యును నిజమనోరథముక్తి కొరకు నైఘనసత్వగుణులుభక్తి । సలిపినవారికి సాలోక్యసామీప్య సారూప్య సాయుద్య సాధనంబు । గావు నన్నితరమా కర్మలు నాచరింపరు వారు నత్యంతభక్తులగుట । గురుతరానేకకల్యాణ గుణవిసిష్టు । డైన శ్రీహరిఁ పొందుదురండ గొనక । పవనవశమున బుష్పాలపరిమళంబు । ఘ్రాణమున నావరించిన కరణి నొప్పి॥ గీ౪

జ్ఞానవిషయము.

గురుదేవపూజయు శుజనవర్జితమును సర్వామునందును సమతబుద్ధ్య । హంకారరహితంబు నాసక్తిశూన్యంబు దార పుత్రాదికధనములందు। సరవినిష్టాయిష్టసమమింద్రియజయంబు నేకాంతవాసంబు నేకచిత్త । మానావమానంబు ముదిదంభమునులేమి వేదాంతశ్రవణంబు విష్ణుభక్తి। నార్జవంబమానిత్వంబు

నహింసయును । వాఙ్మనోనియమంబు సద్వర్తనంబు । నా
త్మపరమాత్మ సంధానుడౌట నివియు । జ్ఞానమా విపరీతమజ్ఞాన
మంద్రు॥ ౧౧

సత్యంబు ధర్మమున్ శౌచంబు దయయును ధృతియు మై
త్రియు సుబుద్ధియునుసిగ్గు । క్షమయునుయశమును దమమును
మోక్షేచ్ఛ శ్రద్ధసమాధానమున్ శమముగల్గి । సంభ్రమంబును
ముక్తసంగుడై యంతటదేహమందాసక్తి దీరియవుడు । గృ
హమందునున్నను గృహిణిపుత్రులయందు సర్వభూతములందు
సమముగలిగి । విషముగల జంతువులయందు విషమబుద్ధి । లేక
నాత్మయొకటి వేరులేదనుచును । సంచరించుచునుండినన్ సర్వ
మయుడ । తనికిమోక్షమిచ్చు ననిరి తత్వవిదులు॥ ౧౨

అధ్యాత్మ తత్వంబు నాత్మగోరుచునుండి బ్రహ్మపదంబు
సంప్రాప్తికొరకు । బెక్కుకాలంబుల బెక్కుజన్మంబుల వైరా
గ్యశాలియై భక్తిసలుప । నీజన్మమందున నేర్పుగా నిప్పుడు
ప్రజ్ఞనవిజ్ఞానసంప్రాప్తుడయ్యె। బరగుప్రబుద్ధుడై బహువారము
లుభగవదనుగ్రహప్రాప్తివరకుదనరి। నిజపరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల
సంశ । యుండునిర్ముక్త లింగదేహుండునగుచు । ననఘు యో
గీంద్రహృద్గేయమగు తదీయ । దివ్యధామంబునొందు సందీప్త
డగుచు॥ ౧౩

ఆత్మనిత్యుండును యఖిలేంద్రియాత్ముండు క్షయ రహితుం
డును స్వప్రకాశు । గగనాదులను నెల్ల గలుగజేసెడివాడుశూ
న్యప్రవృత్తుండు శుభచరిత్రు । సృష్టిహేతుండును క్షేత్రజ్ఞు
వ్యాపకు పరిపూర్ణుడొక్కడు పరమపురుషు । నిస్సంగునిర్మలు

నిత్యము క్తుండును విశ్వాత్ముడై హాగి వేదవేద్యు । డాదిలక్షణ
ము లధికమాత్మకుగల । వనుచు నార్యులు జెప్పుదురవియు
దెలిసి । దేహమందాత్మసిద్ధికై విహితమతిని । వెదుకనా దేహ
మున్నాత్మ వేరుజేసి॥ గీ॥

మణిగణంబుల సూత్ర మమరియున్నట్లుగా నన్నిటి
యందున నాత్మజొచ్చి। దీపించుచుండును దేహాదులందున పం
చకోశాదులు బరిణమించి । యుంచుటను యవ స్థ లున్నట్లు
దోచునుయాత్మకవ స్థలునంటకుండు । స్వప్నమును సుషు పి
జాగ్రతావ స్థతద్వృత్తు లెవ్వనిచేత వేరువేరు । దెల్యు నోనేత
డాత్మగా దెలియవలయు । కుసుమధర్మమా గంధముగ్రుర్తుగాను।
వాయువశమున దెల్యుట వనరినట్లు । బుద్ధిధర్మము ల్యాత్మచే
బుధు డెరుంగు॥ గీ॥

అధికమైనేమిటి యందు నీవిశ్వంబు విదితమైయుండు నీవి
శ్వమందు । నేదిప్రకాశించునెప్పుడు నట్టిస్వయంజ్యోతి రూపం
బునవ్యయంబు । నాకాశమునుబోలి యవిరళ వ్యాపకమును
నాత్మతత్వంబు భూరిమహిమ । దనరిపరబ్రహ్మ మనబడు నది
నెవ్వడాతడు తనయందునాత్మకార్య । కరణములకు సమర్థంబు
గాని భేద । బుద్ధిజనకంబు నాదగుభూరిమాయ । చేతనీవిశ్వము
నుసృష్టి జేసెనట్టి । దేవునాత్మతత్వముగను దెలియు బుధుడు॥

భగవంతునిచర్య.

యేమహాత్ములకైన యేర్పాటుగా సచ్చిదానందుడా ప్ర
త్యగాత్మభూతు । డైనట్టి యఖిలాత్ముడనయ మనసత్ప్రకాశం
బులయ్యు గదున శాశ్వతంబు । లగుమామ కేంద్రియంబైనట్టి

మాయచేనొందించి పంచభూతోపలక్షి । తంబగు దేహావిధం
బునగానంగ బడుచుండుగాని యేర్పడినశుద్ధ । సత్వగుణయుక్త
మైనట్టి సత్స్వరూప । ధరుడునై కానబడడు నాపరమపురుషు ।
డనఘుడచ్యుతుడవ్యయు డప్రమేయు । శాస్త్రగోచరుడందురు
శాస్త్రవిదులు॥ ౬౧

అద్వితీయంబునై యందులోసకలంబు నిక్షిప్తమైయున్న
నిఖిలజగము । బూర్వప్రకారంబు బుట్టజేయుచు వృద్ధివిలయం
బు జేసెడి విశ్వమయుని । నిగమజాతంబులు నిర్ణయింపగ లేవు
బ్రహ్మరుద్రామర ప్రభృతులును । వర్ణింపజాలని పరమాత్మ
లీలగా భువియందుబుట్టుట భూరిమహిమ । రామ రఘురామ
కృష్ణవరాహనార । సింహ కలికాది మూర్తులై శిష్టపాల । నా
దికర్మముజ్జేయు ననంతుచిత్ర । మెరిగిసంస్తుతిజేయ నేనెంత
వాడ॥ ౬౨

### శ్రీహరియవతారసూచిక.

పరమాత్ముడాహరి పరిపాలనకునయ్యు యవతారములు
పొందె నధికముగను । యుగయుగంబులయందు నిగమముల్విభ
జింప వ్యాసంబుజేయుటకు వ్యాసుడయ్యె । కపిలావతారుడై
గడు తల్లితండ్రికి మోక్షంబునిచ్చెను ముక్తసంగు । ధృవుడన
జన్మించి దృఢమైనతపమున ధృవపదంబునునొందెదృఢచరిత్రు
నరుడు నారాయణులనబుట్టి పరమతపము । జేయుచుండ య
ప్సరసలుజెరుపబోవ । కోపముడిగియు యూర్వసి యాదికోటి
కన్య । కామణులబుట్టజేసి రాకామమణచి॥ ౬౩

గీ॥ ఆదిమూలావతారుడై యార్తగుంజర విభునేలి ఘన

జలచరమును ద్రుంచె । హరియు హంసావతారుడై యధికభక్తి భాగవతపురాణంబు నుపన్యసించె॥

పృథుచక్రవర్తియై పృథ్విగోవును జేసి యోషధుల్ బితికె నుద్ఘుప్పిదముగ । యత్రికి సుతుడు దత్తాత్రేయుడనబుట్టి హైహయులకు జెప్పెనాత్మవిద్య । వృషభావతారుడై విష్ణుభక్తియు జెప్పి మునులుసాధులకును ముక్తినిచ్చె। ధాత సనయనుచు దపమందుబలుక సనాఖ్యలన్నల్గురై యవతరించె హరి హయగ్రీవుడై బుట్టి యపుడు నాసి । కాశ్వాసనవర్గములయందు విశ్వపావ । సంబులైనట్టి సకలవేదంబులుద్భ । వింపజేసెను సర్వాత్మవేదమయుడు॥ ౭౮

హరియు యజ్ఞాఖ్యతనాకూతికి రుచిప్రజాపతికి సుతుడై జననమొంది । దక్షిణయనుకన్యదా పెండ్లియైయందు సుయమ నామాఖ్యాదిస్తోమములను । బుట్టించియింద్రుడై భువిని యుపేంద్రులీలనఖిలలోకములందు యార్తి । హరియింపనప్పుడు నతని మాతామహు స్వాయంభువ మనుప్రసంతసించి । యధికహాశ్చర్యమునుబొంది హరియునితడు । గాని సామాన్య పురుషుండు గాడటంచు । భక్తిసలిపెను యజ్ఞాని పరమపురుషు। భక్తి గొలచినవారికి ముక్తిగల్గు॥ ౭౯

[illegible] జుజల తర్పణముజేయ మెరసెను దోసిట మీనుపిల్ల । దానిజూచి నతడు దాఁబెంపబెరిగెను యొకదినంబున లక్షయోజనములు । విస్తరింపనతడు వేయుయుగంబులు గడచినకల్పాంత కాలమగుట । జలమయంబయ్యెను జలమందు మునుగక యోషధుల్మునులును యుండునట్లు । నావకల్పించి

దనకోమ్మునందుగట్టి । యందునుంచెను స్థిరజీవులంత బ్రతుక। నిగమచోరుడ సురుజంపి నిగమచయము। ధాతకిచ్చెనుమత్స్యా వతారువిష్ణు॥ ౬౬

దేవదానవులకు దీరనియుద్ధమం దమరులు నణగుచు నాది దేవు । శరణుజెందినమంద శైలంబుదనవ్రేల లీలగా దెచ్చియు పాలకడలి । లోకవ్యాముగనుంచి లోకేశుకూర్మమై క్రిందుండ వాసుకిన్గిరికిజుట్టి । సురలసురులు బుట్టి సొంపుగాతరువంగగలి గా నమృతమునాకడలియందు। హరియు మోహినిరూపమై యమృతంబు।దనియబోసెను సురలకు దైత్యులంత । జూచుచును మోహమునజిక్కి మంచిపలుకు । లమృతముగనెంచి చెడిరం దరసురులపుడు॥ ౬౭

కనకాక్షునకు స్రష్టగరుణచే నిచ్చిన వరగర్వమున బలవం తుడయ్యు । ధరణినెత్తుకబోవ ధాతచిత్తముననసంతుని దపియింప నాసికమున । యంగుష్టమాత్రుడై యాక్షణంబునఘన సూకరాకారుడై సురలుబొగడ । జొచ్చి రసాతల మొచ్చు హిరణ్యాక్షుని వధియించి నపుడునేర్పుచేత । తనదు దంష్ట్రాగ్రమున నిల్పి ధరణిదెచ్చి । పూర్వమున్నట్లు నునిచెను సొం దుమరచి । ధాతరుద్రుడింద్రాదు లందరుబొగడిరి । యాదివర హావతారు నధికమహిమ॥ ౬౮

దేవతలనుగొట్టి దేవలోకముబలి జేకొన్న నదితియు జేసె దపము । నామెగర్భమునందు నాదిదేవుడు హరి వామన మూర్తియైవనరబుట్టి । బలిని మూడడుగులు వసుధదానంబడ్గియడు గొక్కటను భూమినావరించి । నభ మొక్క పాద మున్నంతట

గప్పియు శేషపాదము బలిశిరమునందు। నిడి రసాతలముకు
ద్రొక్కి యింపుగాను। యిందుయుండుమనుచు జెప్ప నందు
నుండె। నతడు మరల నాకమువజ్రికమరనిచ్చె। నాత్రివిక్రము
నకు మ్రొక్కి రమరులంత॥ ౬౯

అతిభక్తుప్రహ్లాదు డఖిలాత్మహారియంచు ననయంబు నుతి
యింపనతనితండ్రి। విష్ణుభక్తియు విద్యావిద్వేవేనియు నిన్ను
హింసింతుననుచును హేమకసిపు। యఖిలబాధలు బెట్టి యొందుం
డు రాహరి జూపుమీ స్తంభమున్నిపుడుయనుచు। నరచేత చర
చిన నందుండి నరసింహమూర్తియై వెడలియామూఢదైత్యు।
నూరువులజేర్చి నఖములన్యురముచించి। సిరముద్రుంచిన బొగ
డిరి సురలునంత। నతనినౌరసు ప్రహ్లాదునాదరించి। వరము
లనునిచ్చె హరిభక్తవరదుడౌట॥ ౭౦

జమదగ్ని సుతుడునై జన్మించితపమునబ్రహ్మతేజమునొంది
బ్రాహ్మణుండు। పరశునుచేబూని పలుమారువెదకియు దుష్ట
రాజులనెల్ల దునిమివైచి। కార్తవీర్యార్జునిన్ ఖండించి నాతని
పుత్రుల నంతకుపురికిబనిచి। భూభారమునణగించి భూమియు నం
తయు కస్యపాదులకును ఘనముగాను। దానమిచ్చియు స్వర్గ
స్తుతండ్రి జేసి। తాము హేంద్రాద్రికిన్నేగి తపమునిపుడు। జేయు
చున్నాడు జిరకాలజీవియగుట। పరశురాముడు మనుజుడా
బ్రహ్మమగును॥ ౭౧

అఖిలాత్ముడాహరి యదువంశమందున ధన్యుడావసుదేవునితన
యుడయ్యె। పుట్టియు నప్పుడే పోయినందునియింట బెరుగుచు
నుండియు భీతిగోడ। పురిటింటిలోపల పూతన [illegible]

గ్రుక్కెడుగ్రొత్తాగియు గూల్చిచంపె । మరి తృణావర్తుని మడి యించి శకటంబుదన్నియు మద్దుల ధరనుగూల్చి । సరస జెరిగెడి బలభద్రుసహితుడయ్యె । కేవ లానందమూర్తియౌ కృష్ణుడపుడు । గోపగోపికా జనములగూడి యచట । మురళి గానము జేయుచు ముదము గాను॥ ౨౨

నందాదిగృహముల నవనీతచోరుడై గోపికలందరి కోర్కె దీర్చి । బృందావనంబున బ్రీతిచే బశులను గాచుచు నుండియు గమలనాభు । గార్ధభాసురధేనుకాసురుడాదిగా దుష్టరాక్షసు లను దునిమివైచి । మధురాపురంబున మల్లుల కంసుని జంపి మాతృపితృల చెరలుమాన్పి।చారురుక్మిణి కాళింది సత్యభామ। భద్రయున్నగ్నజిత్తి జాంబవతి మిత్ర । విందలక్షణాఖ్యలనర విందనయన । లందరిని గృష్ణు పెండ్లాడె యధిపుడగుట॥ ౨౩

నరకాసురుడు మున్ను చెరలుబెట్టిన పదు నారువేల్కన్యల చెరలుమాన్పి । వారంతవరియింప వారిని పెండ్లాడె నందరి నొక్కడానందముగను। బాణాసురునివేయు బాహులుఖండించి నరకాసురునిబట్టి నరికిజంపి । బాలసఖు కుచేలు పరమ భక్తుం డౌట నతనికిసంపదలన్నియిచ్చి । దంతవక్త్రుని శిశుపాలుధర నుగూల్చి । ధార్తరాష్ట్రులదునిమించి ధర్మతనయు । కీర్తివెల యింపజేసిన కృష్ణునెపుడు । శ్రవణచింతన వందనార్చన లొ నరు॥ ౨౪

పాషండధర్మలు బహుపాపకర్మలు నాచారహీనులున్న । మతులతిలోలులు మ్మందబుద్ధులు నయ్యునుద్ధతబహు విధ పద్ధతులను । వర్తించుచుండెడి వారిదురాచారములను

మాయించిసముచితధర్మ । కర్మభక్తినిలుప కమలాక్షుడాహరి బుద్ధావతారుడై బుడమియందు । సర్వమందు జగన్నాథు సత్యమూర్తి । చక్షులకగోచరుండునై సర్వసాక్షి । దుష్టకర్ముల దునుమాడిశిష్టమతుల । యోగక్షేమమరయుచు నున్నవాడు॥ ౭౫

కలియుగంబున జనులు కపటభాషణులయ్యి వనజాక్షుభక్తి స్తవంబువిడచి । బ్రాహ్మణజాతియు బరగువమట్కారస్వాహాకార స్వధాకారకర్మమంత్ర । వాక్యవేదరహిత భాషందు లోడురుక్షత్రియుల్లేకనుశమదమాది । గుణహీనులై మ్లేచ్ఛకుజను లనేకులు ధరణిపాలనజేయ ధర్మమణగి । బోవు ధర్మ రక్షణకునై బుండరీక । నయను హరికల్క్యగాంతమున కలికావ । తారుడై దుష్టులవధించి ధాత్రియందు । ధర్మమున్నిల్పునందురు ధర్మవిదులు॥ ౭౬

ఆదినారాయణు యవతార నామక ర్మమహిమ నుదువుచు మనములోన । మననంబు జేసెడి మనుజుల కమృతమునజ్ఞానతిమిరంబు నణగిపోవు । వేగంబె శ్రేయస్సు వెలయింప జేయును విజ్ఞానమునునిచ్చు విష్ణుకృపను। సంసారమంబుధిసరగున దాటించు నత్యంతసుఖమును నమరనిచ్చు । చదివినన్గల్గు సంపదల్బడకనుండు । విన్నవారికిగల్గును విష్ణుభక్తి । విగ్రహంబుల నుంచియు విమలమతిని । పూజజేసినవారికి పుటుక లేదు॥ ౭౭

శ్రీ రామావతారకథ.

అసురాదులను రావణాదులు బాధింపవిధియును సురలంత విష్ణుజేరి । రక్షింపుమని వేడ రాక్షసాంతకుహరిజనుడవకుండుడు

మీరు జగతియందు। వానరరూపులై వసరంగ బుట్టుడిశంఖుశే షుడుసేను చక్రములును। దశరథాత్మజులమై ధరయందు నలుగురంబుట్టెదమనిజెప్పి బుట్టిరట్లు। రాము భరతుడు శత్రుఘ్ను లక్ష్మణుండు। కౌసలియ కైకయు సుమిత్ర లాసతులకు। దశరథునకును నారాయణాంశములను। వానరులునైరి దేవతల్వాసుధమీద॥ ౭౮

తనయులఁగల్గిన దశరథుడప్పుడు జాతకర్మాదులు జరిపెనంత। నరరూపుడైనట్టి నారాయణుడు రాము తాటకిన్వధియించి। తపసియాగమును గాచి తనపాదమునుసోక నప్పుడు రాతినహల్యను నాతిజేసి। హరువిల్లువిరచిన యానంద భరితుడై సీరధ్వజునిచ్చెసీతనపుడు। పెండ్లియాడియు నయోధ్యాప్రవేశమనేగి। నచటకొన్నాళ్ళు నుండియు నఖిలజనుల। కిష్టముగ సంచరింప వసిష్ఠుడాది। మునులు రాముచర్యలు జూచియు ముదమునొందిరి॥ ౭౯

ఆజానుబాహుడు నారూఢయవ్వను నిఖలవిద్యాగమ నిపుణచిత్తు। యింద్రసమానుఁ జితేంద్రియు ధర్మజ్ఞు దార బాంధవ జనప్రార్థనీయు। దుష్టనిగ్రహుడును నిష్టపాలకుడును గులపవిత్రుండును గోపరహితు। డగురామభద్రుడు దగునని యందరు, యువరాజ్యపదమీయుయూహసేయ। కైకకోరె భరతునకు గట్టురాజ్య। మిపుడు రాముని డవికంపుమని సవతి। తల్లికోరినవరముకై తండ్రియాజ్ఞ। నడవులకునేగి సీతయున్ననుజుగూడి॥ ౮౦

వనవాసులైనట్టి వరమునీశ్వరులను పూజించి తాము పూజలొందెసి। పంచవటీతీర పర్ణశాలయుగట్టి యందుండి ఖరదూ

షణాది దనుజ। దుష్టులనందరిదున్మి శూర్పణఖను జెక్కిరిముక్కు
ను చక్కలుగను । మారీచుతలద్రుంప మాయచే రావణు
యతిరూపమునవచ్చి యతివసీత । నెత్తుకొనిజనంగ జటాయు
వెదురనేగి । యెగసియుద్ధముజేసియు ఖగముగూలి । సీతజాడ
యు జెప్పిన శీఘ్రముగను । మోక్షమిచ్చెను రాముడు బక్షి
కపుడు॥ ౮౧

ఆసీతజాడకు నన్నదమ్ములునేగ హనుమంతుడొచ్చిన నతని
తోడ । సుగ్రీవుకడకేగి నగ్రజువాలిని నొక్కబాణముచేత ను
క్కడంచి । వానరసైన్యంబు వనగూర్చుకొనిబోయి వననిధి
గట్టించివారితోడ । లంకజొచ్చి యపుడులంకేశు రావణు తల
గొట్టి తనయుల నమ్ముడైన । కుంభకర్ణుని దనుజులగూలనేసి।
శరణు యన్న విభీషణుగ శాశ్వితముగ । లంకకభిషిక్తుజేసియు
లంక వెడలి । సీతయున్ రామలక్ష్మణు లేగనతోడ॥ ౮౨

అయోధ్యకేతెంచి యందరుతల్లులకును మ్రొక్కి రప్పుడు
గురువునకును।భరతశత్రుఘ్నులు భ్రాతులకును మ్రొక్కదీవించి
రన్నలు దేవఋషులు । వాసుదేవు వసిష్ఠు వాల్మీకు డాదిగా
రత్నమంటపమున రామవిభుని । దేవి సీతనుయుంచి దీవించి ప
ట్టాభిషేకులజేసిరి సేసలిడుచు । ఫాలమున హేమపట్టముబరగ
గట్ట । బాలసూర్యుని మాడ్కిని ప్రభయునొప్పె । రత్నహార
ము బంపె పురందరుండు । సురలు పుష్పవర్షములను గురిసి
రంత। ౮౩

భగవంతుడా రామభద్రుండు ప్రజలను దయచేత పాలించె
తండ్రివలెగ । నిజధర్మనిరతుండు నేకపత్నీవ్రతు సర్వలోకవు

లకు సమ్మతుండు । నుత్తముడనఁ జెప్ప నుర్విపాలనమున పూ ర్వపురాజులు పుడమిలోన । రాజర్షివరులచే రాజితంబైనట్లు వంతకంబౌను కడుసంతసముగ । కీర్తివడసియునుండి సద్వర్తన మున । తనకున్నై తాను యశ్వమేధంబుజేసి । యడిగినట్లు బ్రా హ్మణులకు యర్థమిచ్చి । వినతుడైయుండె నారాము విభుడు ఘనుడు॥ ౮౨

## శ్రీరామగీతలు.

• వేలవత్సరములు వేడ్కతోధరనేలి వేదాంతవేద్యుడా వేద మయుడు । విజనస్థలంబున విచ్చేసియుండంగ భక్తిపురస్సర భయముచేత । వినయ విధేయుడై వేయినమస్కృతుల్ జేసియు నన్నకు శ్రేష్టముగను । శుద్ధభావనచేత శోభితు సౌమి త్రి యనియెను రామసర్వాంతరాత్మ । భ్రమరమెప్పుడు మక రందపానమెరిగి । జేయురీతిని నీపాదశేవమరిగి । నిర్మలాత్ములు జ్ఞానులునిన్ను నంత । రాత్ముడవు నిరాకారుడ వందు రెపుడు॥

ధ్యానయోగులచేత ధ్యానింపబడునట్టి యజ్ఞాన తిమిరంబు నణచునట్టి । సంసారమంబుధి సరగునదాటంగ నౌనట్టి నీపాద మమరగొలుతు । నాదియులేనట్టి నజ్ఞానతిమిరంబు నేవిధంబున నేను నెట్లుగడువ । గలనొనావిధమంత గరుణచే నుపదేశమిచ్చి రక్షింపుమో యినకులాబ్ధి । చంద్రశేఖరుజెందితిని నీచరణయు గము । రఘుకులాన్వయ శ్రీరామ రామ రామ । యనుచు సౌమిత్రి బలికినవన్ని వినియు । నార్తిహారణుండు శ్రీరాముడని యెనపుడు॥ ౮౩

పూర్వజన్మంబున పుణ్యపాపములైన కర్మముల్జేయుటఁ గల్గెజన్మ । యింద్రియలోలుడై యిపుడు కర్మలుజేయు నెగడు జన్మము ముందు నిత్యముగను । మరలకర్మలు జేయమరిజన్మములుగల్గు దీరదు చక్రంబుదిరుగుపగిది । సంసారజలనిధి సమకూర్చునజ్ఞాన మొదటికారణ మదిముఖ్యముగను । దానబుట్టిన కర్మంబు దానిజెరుప । జాలదా విరోధిజెరుపజాలు నెపుడు।జ్ఞానమున్ భక్తిగలుగ నజ్ఞానమదియు। దనకుదాను నసించును దధ్యమిదియు॥ ౮౭

అజ్ఞాననాశన మదిగాదు కర్మచే కర్మకునోషంబుగలిగియుండు । కోరికలెప్పుడు గోరుచునుండును బుణ్యంబుక్షీణింపబుట్టు భువిని। మరలసారంబుమరిగల్గుకర్మచే బుద్ధిచేనెరిగియు బుధుడు నెపుడు । సహాకారియానిత్య సహజకర్మంబులుదేహాశుద్ధికిగాను దీర్పవలయు । కర్మజేయకబోయిన గలుషమనియు । వేదముఖమునజెప్పెను విదితముగను । మోక్షమునుగోరువాడును మొదలుకర్మ । జేయుటనుగల్గు నప్పుడు చిత్తశుద్ధి॥ ౮౮

శాశ్వితఫలమును శాసింపదాకర్మ క్షీణఫలంబుల జెందజేయు । నస్వాతంత్రియగుట నధ్వరమెప్పుడు సృక్స్రువ ధ్వరధనస్థితినిగోరు । జ్ఞానకర్మలకును ననయంబు సంయోగ మదిముక్తికౌననియ బుధులంద్రు । దేహాభిమానంబుదీరదు కర్మచే యభిమానరహితమా నాత్మవిద్య । దవిలి వేదాంతవాక్యముల వినుగురువు । గరుణచే నుపదేశింప గలుగువిద్య । మోదమల రించు చెడకుండముక్తినిచ్చు । గాన నరునకు జ్ఞానంబు గలుగవలయు॥ ౮౯

అజ్ఞానమునతాను నాత్మనెరుంగక దేహేంద్రియాదులు స్థి
రముగాను । నేనునావనియును నెంతకాలముదోచు నంతకాలం
బును నఖిలకర్మ । ములకు విధేయుడయి ముదమున జేయుచు
నెప్పుడు దనను దానేకముగను । దెలియునో నప్పుడు దేహేం
ద్రియాదులు నేగానుగానని నెరిగిదృశ్య । మంతయునిషేధమొ
నరింపనాత్మనిలచి । యుండునది యేదా బ్రహ్మంబు నొప్పుగాను।
యెరిగినంతట కర్మముల్ యింద్రియవిష । యంబులగ్ని విడువ
వలయు నపుడునతడు॥ ౯౦

జీవేశ్వరులకును జెందుమాయా విద్యల యుపాధిభేదంబుల
యముజేయు । నట్టివిజ్ఞానంబు నమరినయప్పుడేసంసార కారణం
సమసిబోవు । తత్వమస్యాదుల తాత్పర్యమెరిగిన నాశణంబ
నశించునాయవిద్య । యదియు నాశనమైన యపుడేమియును
లేదు కార్యకారణములు గలుగకుండు । కర్తనను యహంకా
రంబు గలుగదపుడు । విద్యతాస్వతంత్రియగుట వెలుగుచుండు।
నితరకర్మ లపేక్షింపక తనకయ్యు । తానువృద్ధియగాచుండుచి త్త
మున నెపుడు॥ ౯౧

సౌమిత్రి నీచేత సకలకర్మంబులువిద్యకుసమమని వింటినై తె।
తగినదృష్టాంతముల్ దగజెప్పలేవైతి వధికసాధనముల నమరు
కర్మ । కర్మకు వేరయ్యుగడగి విజ్ఞానంబు బుద్ధిచే ఘనముగవృద్ధి
నొందు। యజ్ఞానుడెప్పుడు నాత్మనెరుంగక యింద్రియ దేహాదు
లివియునేను।పాపయు క్తుడనంచును ఫలమపేక్ష । గలుగునజ్ఞాను
నకు నఖిలకర్మవిధిక్రి । తంబిదియు సుప్రసిద్ధమా తత్వ విదున ।
కదియుగాదు కర్మత్యాగి యానునతడు॥ ౯౨

విధివిధానంబుగా విజ్ఞానమునకునై వాక్యార్థములను దా
ప్రథమమందు । దెల్యనౌ తత్పదం దెల్పెద పరమాత్మ బరగు
జీవాత్మత్వంపదముయగును । యసియనుపదమాను యదియు
జీవేశుల కైక్యంబుదెల్పుట కమరుచుండు । యీశ జీవేశుల
కెపుడు ప్రత్యక్పరోక్షుంబునౌ సాక్షిత్వ సద్వితీయ । భేదములు
గల్గు నవియును విబుధుడెరిగి । నపుడు జహాదజహాల్లక్షణాది
విధుల । దెలియజీవాత్మ బరమాత్మ దేజమొకటి । యౌను
లక్ష్యంబు చేతను యమరునదియు॥ ౯౩

యిదియునుగాను నేనిదిగాను ననియెడి శృతియుక్త వాక్య
ముల్ శృతముగలిగి । దేహేంద్రియాదులక ధీవృత్తిచేత నిషే
ధించియపుడు విశేషమైన । చిద్ఘనామృతముచు శేవించినంతట
ఫలముగోరెడువాడు ఫలరసంబు । పానంబుజేసియు ఫలమువిస
ర్జించు చందంబు నీప్రపంచంబునంత । విడువవలయు నాత్మకె
పుడు వృద్ధిలయము । బుటుక లేదు యానందరూపుండుయద్వ ।
యుండు దాస్వప్రకాశుడై యుండునెపుడు॥ ౯౪

యుత్పత్తిరహితంబు నున్నదిలేదని జెప్పశక్యముగాదు చేష్ట
లవియు । యీశ్వరాదికమును యింపుగాబుట్టింప బరమాత్మ
కెప్పుడు బరగుమాయ । ఘనకారణంబయ్యె గలుగునుపాధిభే
దంబుచే నొక్కచైతన్య మదియు । జీవేశ్వరులనెడి జత్తంబు
గల్పింప రాజౌనవిద్యకారణశరీర।మగునుపాధిపరిత్యాగ మమర
జేయు । లక్షణావృత్తిచేతను లక్ష్యమెరుగ । నపుడభేదంబుగా
నాత్మనమరునదియు । తానని తనయందునెరుగ తత్వ మగును॥

స్ఫటికంబునెప్పుడు స్వచ్ఛమై యుండియు రక్తాదికముగాడి

రంగు వేరు । గనుపడు చందమా గలదాత్మ తేజంబు పంచకోశం
బులు బరిణమింప । తత్తదాకారంబు దగగల్గినట్లుండు దాపూ
ర్వవాక్యముల్ దగవిచార । మొనరంగ జేసిన నెక్కడో నా
యాత్మపుటుక లేక నెపుడు పొందు లేక । స్వప్నమాదిగ భేదముల్
...మాది । గుణములవి బుద్ధిధర్మముల్గాడ కెపుడు । పరుడు
నిత్యుండు కేవల బ్రహ్మమద్వి । తీయునందు మిథ్యలనుచు
దెల్యవలయు॥ ౯౬

యిట్టి యాత్మకు నెట్లు గట్టిగా సంసారదుఃఖరూపం బెట్లుదో
చుననిన । యజ్ఞానవశమున నధ్యాసయునుగల్గి దేహేంద్రి యా
దులు దిరముగాను । నేనన నప్పుడు నెగడుసంసారముఁ జ్ఞానం
బు లేమి నజ్ఞానమదియు । జ్ఞానవిరోధి యజ్ఞానమాట జ్ఞానముఁ
గల్గ నజ్ఞానమున్న శించు । రజ్జుజూచియు పాముని రాత్రిఝడిసి ।
నటుల పరమేశ్వరాంశ యూనాత్మయందు । నమరు నధ్యాసవశ
మున నన్నదియుబుద్ధి।ధర్మమనియును జెప్పుదు రత్త్వవిదులు॥ ౯౭

సకల మాయాగుణశక్తి సంబంధవర్జితుడగునట్టి యాచిత్స్వ
రూపు । సర్వకారణుడయ్యు నిర్వికారుండు నిరామయు కేవలు
డంతరాత్మ।సంగవర్జితుడును సర్వవిలక్షణుబయుడు బ్రహ్మంబునై
బరగు నచట । మొదట కల్పితమైన మోహామహంకార మది
యును నధ్యాసమగునుమరియు।సకల కామాదికములు సంసార
హేతు । కంబులవి బుద్ధిధర్మముల్గావునను । సుషుప్తి యందు
లేమిని నాత్మసుఖముగాను । నుండునంచును దెలియుచే దండి
మహిమ॥ ౯౮

ఆది లేనియవిద్యయందు బుట్టినబుద్ధి నమరినప్రతిబింబుడో ను

జీవు । డాత్మయునెప్పుడు నాబుద్ధినంటక సాక్షియైయుండును సర్వమునకు । ధీవృత్తిచేతనుదెల్యనా పరమాత్మ జీవాత్మ యనుచు ప్రసిద్ధముగను । నాత్మబుద్ధితోజేరి యన్యోన్యముగ నుండ నధ్యాసవశమున నాత్మయందు । జడము చిత్తమునందు నజడముదోచు ।. నొక్కచో జీవుడా బుద్ధినుంటజేసి । యగ్ని తప్తమగా లోహంబుయగ్నిరూప । మగు దలిగియుండదా చందమునను దోచు॥ ౯౯

గురుకృపచేతను గురుతుగా వేదాంతశ్రవణముగ మననంబు సల్పెనేని । జ్ఞానానుభవమున దానాత్మయగా మరి సర్వమునందును సమముగాను।హృత్కమలంబున నింపుగారంధ్రంబు నూత్న్మమైయుండును శుభ్రముగను । నందులోపలనుండు నగ్నిరూపంబున పచ్చనికాంతితో బరగుశిఖలో । బరుడు బ్రహ్మంబునున్నాడు భద్రముగను । యణువుకంటెను మిక్కిలి యణువునయ్యు । మహాతుకంటెను మిక్కిలి మహిముడయ్యు । నఖిలమందునమున్నాడు నత్యుతుండు॥ ౧౦౦

పరిణామ రహితంబు పరిమితియును లేదు పుటుకయు లేదు సంపూర్ణమగుట । నానందమయమును నద్వితీయంబును యతినిర్మలంబైన యాత్మనేను । ముక్తుడనౌదును మూడుకాలంబుల నతిశక్తియుతుడనేనౌదు నెపుడు । దహ్రామగా నాకాశదా నిర్మలంబౌట నందుండువాడను నంతటనుచు । నచలభావన యుక్తైన నతనికపుడు । తత్క్షణంబునను నవిద్యాదగ్ధమగును । నధికదివ్యౌషధంబుచే నఖిలరోగ । ముల్నశించునట్లుగ కర్మము ల్నశించు॥ ౧౦౧

యేకాంతవాసుడై యెపుడు ప్రాణాయామమందున నియమి తంబైన చిత్త । వృత్తియుగలిగియు విషయచింతనలేక యంత ర్ముఖుండునై యాత్మనెరిగి । యింతకంటెను ముక్తికితర సాధన ములు యింక లేవనుచును యెరిగియపుడు । విజ్ఞానదృష్టిచే వేరు లేదనుచును నిక్కమానాత్మదా నెక్కటనుచు । సకల దృశ్య పదార్థముల్సమయజూచి । పూర్ణుడయ్యును నానందపురుషుడ య్యు । కొంచమైనను బాహ్యంబుగుర్తులేక । యంతరంబును దెల్యడు యతివరుండు॥ ౧౦౨

ఘనుడు నకారంబుగల విశ్వనామకు దవిలియుకారంబు తైజసుండు । బరగుమకారమా ప్రాజ్ఞనామకుడని సకలవేదం బులు చక్కగాను । బలుకుచున్నవి నిట్లుభావింపవలయును పూర్వసమాధికిపొందుగాను । జాగ్రదవస్తలో జగమున వ్యవ హారమొనరజేసెడి విశ్వుమొదటి వర్ణ । మగు నకారంబునందు స్వప్న । కల్పితుడగు తైజసుని నుకారమును మ । కారమం దును ప్రాజ్ఞామకారవర్ణ । మదియు నాత్మయందు లయము నమరజేసి॥ ౧౦౩

ఆయాత్మరూపంబునాదును నేనంచు విడువబడ్డ యుపాధి వేరుయగుట । నిత్యముక్తుండను నత్యంతనిర్మలజ్ఞానముస్గలిగి విజ్ఞానయుతుడ । నాటచే నెప్పుడు నానందమయుడను యను చును పాసకుండనవరతము । పరమాత్మభావన బరగినవాడ య్యు దృశ్యప్రపంచంబునశ్యమనుచు । చతుర్వింశతి తత్వము ల్చందకపుడు । బంచవింశకుడయ్యును బరగుజీవు । డచలమం బుధిచందానయమరినాత్మ।నిత్యముక్తుండునాటనునిత్యుడగును॥

ఆదిని మధ్యను నంతమందెప్పుడు సకలదుఃఖంబు సంసార మనుచు । దెలిసియు నంతట దెంపియు మోహంబు యరిషట్క మణచియు నంతమీద । యితరచింతలు లేక యేకచిత్తముగల్గి యోగనిష్ఠునైన యోగివరుడు । యభ్యాసమున నన్ను యాత్మగా దెలియుటన్న తనికి దృశ్యుడన్న గుదు నేను । సకలబంధము ల్విడిచియు సార్వకాల । మాత్మ పరమాత్మమైక్యంబు నమర జేసి । యనుభవించియు ప్రారబ్ధమంతమీద। పొందుచున్నాడు నన్ను నాబుధవరుండు॥ ౧౦౫

యెంతకాలంబును యెరుగడో జగమంత నారూపమంచును నంతవరకు । నారూపములనుంచి నయముగాపూజించి శ్రద్ధచే భక్తియు సల్పవలయు । నన్ను పాసింపుచు నాకు నమస్కృతు ల్జేయువానికి నేను చిత్తమందు । గనుపడుచుండుదు గరుణచే నెప్పుడు ప్రేమచే జెప్పితి ప్రియుడనీకు । నమరనాచేత నిశ్చితంబైన వేద । సారసంగ్రహ గోప్యంబుసాధు డెవ్వ । డేనియు జదివియర్థంబు నెరిగ నేని।తత్క్షణంబున పాపముల్దగ్ధమగును॥ ౧౦౬

యిష్టంబుగా మది నెప్పుడైనను నన్ను గుణయుక్తుడనియును గుణమతీతు । గుణరహితుండని గొలిచెడి వానిని నాపాదరజ ముచే నతిపవిత్రు । జేతు నెప్పుడు భానుచెలగి లోకంబులు పావనంబును జేయు పగిది నేను । విజ్ఞానమిదియంత వేదసారం బును విదితమౌ వేదాంతవేద్యమైన । చరణముల్గల నాచేత జెప్పబడిన । వచనములయందు నాయందు వసరశ్రద్ధ । భక్తి యునుగల్గి నెవ్వడు పఠనజేయు । నతడు నారూపముని బొందు నంతమందు॥ ౧౦౭

అని రామచంద్రుడు యనుజునకుజెప్పెను యుపనిషదార్థ
మాదున్నదంత । నమరంగ నధ్యాత్మమైన రామాయణ
ముత్తరకాండలోనుండె ముక్తి । నిచ్చుగీతలు నివి నింపుగా
నున్నవి శంభుడా మహిమను సాంతమెరుగు । నందునర్ధంబెర్గు
నాదేవి గౌరియు దానిలో సగమును ధాతయెరుగు । నందుకొంత
జెప్పెను బ్రహ్మానందునకు । ననుచు గీతామహాత్మ్యము నాదు
నుండె । నదియు తెనుగుచే వ్రాసితి న్నందరెరుగ। ముక్తిగోరెడి
వారికి యుక్తమగును॥ ౧౦౮

శ్రీరామచంద్రుడు శ్రీకృష్ణమూర్తియు నారాయణుం
డును నారదుండును । బ్రహ్మయు రుద్రుడున్ బ్రహ్మవేత్తలు
నైన వాల్మీకి సూతుడున్ వ్యాసశుకులు । ఋషభకుమారులు
రూఢిగాజెప్పిన వాక్యములను కొన్ని వ్రాసితిందు। బుద్ధిమంతులు
దీని బుధులచే తాత్పర్యమెరిగియు జదువుచున్ యిష్టమతిని ।
యేకచిత్తులై మననమున్నెపుడు జేయ । వాసుదేవుని కృపయును
వనరగలుగు । హరినిదలచుచు పూజింప హరికృపావ । శమున
దాటగలరు భవసాగరమును॥ ౧౦౯

ప్రొద్దున మేల్కాంచి శుద్ధమనస్కుడై ప్రాంజలిబద్ధుడై
ప్రాభవమున । పరమాత్మయందును భక్తిచే నిత్యమున్ పఠన
జేసిన యట్టిభక్తులకును । వేగంబె శ్రేయస్సు వెలయించుదైవం
బు పొందించు సుఖమును పుడమియందు । సంసారమంబుధి
సరగునదాటించు సకల సంపదలును సంభవించు । ఘనముగా
జద్వివినిపింప కర్మబంధ । ములు విముక్తియైయుంతట ముక్తి

గలుగు । పరుడనంతుని కృపయును భక్తిగలుగు।నంతరాత్మను దెలియుటన్న మరునంత॥ ౧౧౦

శ్రీరామనామము శ్రేష్ఠమైయుండును బలుకుటకొరకునై బరమనులభ । మా రామనామంబు లాటలాడుచుబల్క నానందభరితమై యమరుచుండు । శ్రీరామరామని స్థిరముగా నుడివిన న్యమరుజిహ్వాకు నదియమృతంబు । శ్రీరామనామము చింతజేయుచునుండ నితరచింతలు మానునెల్లప్రొద్దు । యోగిహృద్గేయమై యంతరంగమునను । సచ్చిదానందరూపుని సర్వమయుని । నమ్మిరమియించుటనురామనామమయ్యె । ముదమున స్మననము జేయ ముక్తిగలుగు॥ ౧౧౧

శ్రీరామ నినునమ్మిశేవించు జనులకు కల్పవృక్షమవయ్యా కమలనాభ । ఘనముగాపూజించు గడుభక్తులకు నీవు కామధేనువవయ్యా కంబుకంఠ । సిరియునుగోరిన సిరిసంపదలునిచ్చి క్షేమంబులరతువు శ్రీనివాస । కామంబులేకను ఘనమోక్షమడిగిన కైవల్యమిత్తువు కమలనయన । మహిమనొప్పెడి బుధులకు మంగళాత్మ । సచ్చిదానంద మయుడయో సర్వసాక్షి । పరమమునిగేయ సంతతభాగధేయ । రఘుకులోద్భవ శ్రీరామరామనామ॥ ౧౧౨

ఇతి శ్రీరామచంద్ర కరుణాకటాక్ష
లబ్ధకవిత పరిటేలకొండలారా
యాఖ్యప్రణీతంబయిన
శ్రీభగవద్భక్తి జ్ఞానసంగ్రహము.
శ్రీపరమేశ్వరార్పణమస్తు.

10242

# ఆంధ్ర దేవీభాగవతము.

పండిత దాసు శ్రీరామ విరచితము.

మృదుమధురశైలిలో వ్రాయబడి 1,200 పుటలును, 10,000 పద్యములును గలిగి గిల్టు అక్షరములతో సిందు కాలికోబైండు చేసినది. సమస్తపురాణములయందుండు కథలును సంగ్రహముగాగాని సవిస్తరముగాగాని దీనియందు గలవు.

ఈ గ్రంథము ఇహపరసాధకమని పెద్దలు పరిగణించి యున్నారు.

ఇది మిక్కిలి గొప్పపుస్తకమైనను దీనివెల మిక్కిలి సులభముగా నున్నదని గ్రంథము చూచినవారు తెలుసుకొనవచ్చును.

వెల ప్రతి 1కి రు 4-0-0, పోష్టుఖర్చులు కొనువారే భరించవలెను.

ఈగ్రంథము బెజవాడ వాణీ ముద్రాక్షరశాలలో దొరుకును.